# శ్రీరామకృష్ణాంజలి



కర్త :

'సాధన రహస్య', 'సర్వ సిద్ధాంత సౌరభా' ది

బహు గ్రంథ కర్తలు

శ్రీరామకృష్ణాశ్రమములు (బాపట్ల - భీమునిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ అనుభవానంద స్వామి



ప్రకాశకులు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల

ప్రచురణ సంఖ్య : 002

పంచమ ముద్రణము : 1996

వెల : రు. 3.00

ప్రతులకు :

శ్రీ అనుభవానంద గ్రంథమాల,
యం.జి. రోడ్డు, బాపట్ల - 522 101,
గుంటూరు (జిల్లా).

మరియు

స్వామి అనుభవానంద యోగేంద్ర,
భీమునిపట్నము - 531 163,
విశాఖపట్నం (జిల్లా).

# పరిచయము

మానవుని జీవితము విశ్వాసముతోనే ప్రారంభమగును. ఆ విశ్వాసమేలేనిచో జీవితమున సుఖశాంతులు లభ్యముకావు. జీవితపు చరమదశలో అవిశ్వాసముచేతనే అందరికి దూరమై అశాంతి పొలగుచున్నాడు.

ఈ విశ్వాసము లౌకికమనియు, అలౌకికమనియు రెండు విధములు. ఆ విశ్వాసముచేతనే తల్లిదండ్రులపై గౌరవము, చిన్నవారిపై వాత్సల్యము, పెద్దలయందు వినయము, సేవకులపై కరుణ, సమానులతో స్నేహము, గురువులపై పూజ్యభావము, దైవముపై భక్తియును కలిగి మానవుడు తన జీవితయాత్రను కొనసాగించుచుండును. లౌకికవిశ్వాసమున స్వార్థము అంతర్గతమై యుండును. అహంకారమమకారములు అభివృద్ధి చెంది, స్వార్థము పెరిగిన కొలది వ్యక్తులపై యీ విశ్వాసము తగ్గుటచే నశాంతి అధికమగుచున్నది.

అట్లుగాక, రెండవదైన, అలౌకికవిశ్వాసము, లౌకికసంబంధములలో తగ్గుచు, దైవముతో ప్రారంభమగుటచే, నిందు అశాంతికి తావులేదు. నిర్గుణ, నిరాకార, నిర్వికార, నిరంజన, నిర్మల, నిత్య, నిరవయవ, సర్వాతీత, సర్వవ్యాపక, సర్వాంతర్గత, సచ్చిదానంద బ్రహ్మమే, సగుణ సాకారమూర్తియై, భక్తుల ఆవేదనకు కట్టు[illegible], వారినానందింపజేయుటకు, సజ్జనరక్షణకు, దుర్జనశిక్షణకు, అనేక అవతారములు ధరించి, మానవునికిగల సంబంధములలోనే తన[illegible] ఉపాసింపజేసుకొనును. ఆ యవతారములలోగూడ మత్స్యావతా[illegible]మునుండి పరశురామావతారమువరకు అర్చనావతారములు

కాగా, రామావతారమునుండి అర్చన, అనుసరణ, ఆచరణములు ప్రారంభమై, ఉపాసకునికి శాంతి లభించుచున్నది. ఇందు శాంతి దినదినాభివృద్ధి పొందుచు, తననాశ్రయించినవారినికూడ చేరుచు న్నది. భగవంతుడు శాంతి స్వరూపుడుగదా! ఇక అశాంతి ఏది? అట్టి భగవానుని దర్శింప జేయువాడు సద్గురువు. మానవుడు దైవ విశ్వాసము కలిగి, అటుపై ఆత్మవిశ్వాసమును పొంది, అంతట మార్గవిశ్వాసముతో గురుపుంగవు నాశ్రయించి, ఆ గురువిశ్వాస ముతో భగవత్స్వరూపమును దర్శించి, ఆనందించి, తరించి, శాంతిని పొందును.

భగవద్విశ్వాసము భగవదనుగ్రహ లబ్ధము. అట్టి విశ్వాస ముతో శ్రీ అనుభవానంద స్వాములవారు యీ 'శ్రీ రామకృష్ణాం జలి'ని వ్రాసియున్నారు. ఈ గ్రంథమునందు అవతారవిశిష్టత్వ ము, శ్రీ రామకృష్ణదేవుని సర్వసమన్వయత్వము, శ్రీ రామకృ ష్ణుని ప్రత్యేక సాధనావ్యక్తిత్వము, శ్రీ వివేకానందస్వామి గొప్ప దనము, శ్రీ అనుభవానందస్వాములవారి ఆవేదనములు పాఠకుల హృదయములను రంజింపజేయగలవు.

మా తా జీ త్యా గీ శా న ం ద పు రి

శా· శ్రీగోవింద। ముకుందవందిత। మహచ్ఛ్రీదివ్యపాదారవిం
దా। గోపీజనచిత్తచోర। సురసంతానప్రియా। బ్రహ్మసం
యోగానంద। వివేకమౌనినుత। ఖద్యోతప్రతిద్వంద్వతే
జోఽగారా। భగవాన్। గురూ। పరమహంసా। రామకృష్ణప్రభూ!

శ్రీరామకృష్ణప్రభూ। గోవిందా। ముకుందవందితా। మహత్ శ్రీదివ్యపాదారవిందా। గోపీజనచిత్తచోరా। సురసంతానప్రియా। బ్రహ్మసంయోగానందా। వివేకమౌనినుతా। సూర్యసమానతేజోనిలయమా। భగవాన్। గురూ। పరమహంసా।

శా· రామున్ వర్ణనసేయ బంచముఖుడున్, బ్రహ్మాండనిర్మాతయున్
వేమారోడుదురంట। కృష్ణుని నిరూపింపన్ బ్రయత్నించి, తా
నామూలాగ్రము వాణి డస్సెనట। దేవా। రామ–కృష్ణుండవౌ
మీ మాహాత్మ్యము నెంచ నేరికగు స్వామీ। రామకృష్ణప్రభూ!· 2

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! శ్రీరాముని వర్ణించుటకు పంచముఖుడు, బ్రహ్మాండకర్తయైన బ్రహ్మయును అనేక పర్యాయములు ఓడిపోయారట। అదేవిధంగా శ్రీకృష్ణుని నిరూపించుటకు ప్రయత్నించిన సరస్వతీదేవియు పూరిగా అలసి పోయినదట। ఇక నీవో। రామకృష్ణుడవుగదా! స్వామీ! నీ మాహాత్మ్యమును ఎవరు వర్ణింపగలరు?

మ· మతకంబందు జరించు జీవునికి సన్మార్గంబులన్ జూప, నం
ధత నిర్మూలము సేయ, సత్యముగ నిన్ ధ్యానించుటే త్రోవ నా
నతిభక్తిన్ నుతియింపబూనితిని నిత్యానంద। నే నిన్ను, శ్రీ
పతి, నీవేగద నాకు దిక్కికను దేవా! 3

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నిత్యానందా! అజ్ఞానమున జరించు జీవులకు సన్మార్గమును జూపుటకును, అజ్ఞానమును తొలగ

ద్రోయుటకును వచ్చిన నిన్ను ధ్యానించుటయే యథార్థమార్గమని గ్రహించి, నిన్ను భక్తితో స్తుతించుటకు పూనుకున్నాను. ఇక నీ వేగదా నాకు దిక్కు.

మ. కృపతో సాయము సేయుదీవనుచు, నీకీర్తిన్ బ్రశంసింప, లో
పపు భాషన్ గడు పేదభావములతో వ్రాయంగ నే బూనితిన్,
సుపదంబుల్, గురుభక్తితత్త్వములు సుశ్లోకప్రభాభావనల్
గృపతో గూర్చవె వాసుదేవ! ప్రణతుల్ .. 4

శ్రీరామకృష్ణప్రభూ! వాసుదేవా! నమస్కారము. భాషా లోపములున్నను, భావనాపటిమ లేకున్నను, నీవు సహాయము చేయుదువనే దృఢవిశ్వాసంతో, నీ మహిమను కీర్తించాలనే భావనతో యీ రచనను ప్రారంభించాను. కాన నాకు పదజాలాన్ని, చక్కని భావములను, దయతో అనుగ్రహించు.

మ. 'ష్ణ' యనన్ జిష్ణుత కామషట్కరిపులన్ సంహారమున్ జేసియుం
టయు, నానావిధ మోక్షమార్గముల నిష్ఠన్ జొచ్చి, నిత్యంబు ని
ర్భయతన్ వే గుణంబునిర్గుణములన్ బ్రహ్మత్వమున్ బొందశ
క్తియుతుండౌటయు దెల్పుగాదె! నుతకీర్తీ! .. 5

శ్రీరామకృష్ణప్రభూ! 'ష్ణ' యనగా అరిషడ్వర్గమును జయించి, సంహరించి యుండుట అనియు, నియమనిష్ఠలతో అనేక మోక్షమార్గముల నిర్భయమున ప్రవేశించి, సగుణనిర్గుణములను, బ్రహ్మత్వమును పొందు శక్తి కలవాడనియు సుస్పష్టము.

మ. ప్రతిభన్ జూపగ వేదశాస్త్రములకున్ భాష్యంబులన్ వ్రాయుటల్
మతిలో నెంచక, నాచరించి, కడు ధీమంతుండవై, సాధకుల
మతతత్త్వంబుల యోగమార్గములలో మగ్నత్వమున్ బొంద దా
ల్చితివో వ్యాఖ్యగ నీ స్వరూపము ప్రశస్తిన్ .. 6

శ్రీరామకృష్ణప్రభూ! వేదశాస్త్రములకు చక్కని భాష్యముల వ్రాసి, కీర్తిని పొందవలయునని భావింపక, పటుతరబుద్ధిశక్తితో ఆచరించి, సాధకులు ఆ మతతత్త్వములందును, యోగమార్గములం

దును నిమగ్నులగుటకు ఆ భాష్యవ్యాఖ్యానస్వరూపమునే ధరిం
చితివిగదా!

శా· భూతాత్మన్ జగదేకవంద్య బరమాత్మన్ నిత్య మాన్యండవై
జాతంబైన పిపీలికాది చతురాస్యబ్రహ్మపర్యంతమున్
బ్రీతిన్ సర్వసమత్వదృష్టిగని, శక్తిన్ నీదు మూర్తిన్ గుణా
తీత బ్రహ్మలయంబు సేయుదువు ఖ్యాతిన్ ·· 7

శ్రీరామకృష్ణప్రభూ! పిపీలికాది చతుర్ముఖ బ్రహ్మపర్యంత మగు జీవరాశియందు, సర్వభూతాంతరాత్మయు, జగదేకవంద్యుడును, నిత్యుడును అయిన పరమాత్మను సర్వసమత్వమున సప్రేమమున గాంచి, శక్తియుక్తుడవై, మహాత్ముడవై, నిర్గుణపరబ్రహ్మ తత్త్వమున లయము నొందుచుంటివిగదా!

శా· శ్రీదేవా! సురసన్నుతా! సుజనసంసేవ్య ప్రభాభాసితా!
వేదవ్యాఖ్య! ముకుందపూజిత! హరే! ప్రేమస్వరూపా! మహే
శా! దామోదర! సర్వలోకగురు! విశ్వాధార! విశ్వాధ్య! ఈ
శా! దేవా! భగవాన్! గురూ! పరమహంసా! ·· 8

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీదేవా! సురసన్నుతా! సుజన సంసేవితా! తేజోమూర్తీ! వేదవ్యాఖ్యానమా! ముకుందపూజితా! హరే! ప్రేమస్వరూపా! మహేశా! దామోదరా! సకలలోకగురూ! విశ్వాధారా! విశ్వాధ్యా! ఈశా! దేవా! భగవాన్! గురూ! పరమహంసా!

శా· శ్రీరామాది దశావతారముల సప్రేమంబుతో దాల్చి, సం
సారంబందు నిమగ్నులైన నరులన్ సంరక్ష గావింప స

ద్వైరాగ్యంబును, జ్ఞానమున్ దెలుపు దివ్యజ్ఞానమూర్తీ! నమ
స్కారంబుల్ గొనుమయ్య పద్యగతి నీశా! .. 9

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! శ్రీరాముడు మొదలుగాగల దశావతారముల ప్రేమతో ధరించి, సంసారమగ్నులైన మానవుల రక్షించుటకు జ్ఞానవైరాగ్యముల ప్రబోధించు దివ్యమూర్తీ! పద్య క్రమములో నా నమస్సుల స్వీకరింపుము.

మ. నవమాసంబుల మోసి, నిన్ను గని, ప్రాణంబట్లు బోషించి, గౌ
రవమర్యాదల ప్రేమముంచు గుణచంద్రాదేవియున్, రామభ
క్తివిశేషుండు పవిత్రుడార్యుడు ప్రశస్తిన్ శ్రీక్షుదీరాము డే
మి వరాలన్ గనినారొ! నిన్ను గన స్వామీ! .. 10

శ్రీరామకృష్ణప్రభూ! నవమాసములు నిన్ను ధరించి, కని, నిన్ను ప్రాణమురీతి బోషించిన సుగుణమణియైన తల్లి చంద్రామణీదేవియు, విశేష రామభక్తితత్పరుడును, పవిత్రుడును, పూజ్యుడును అయిన తండ్రి క్షుదీరాముడు నిన్ను పుత్రునిగా పొందుటకు ఏమి వరముల పొందియుండిరోగదా!

మ. జడమౌ రాతిని గొల్చి, దాన పరసాక్షాత్కాళి దర్శించి, యం
తట సంభాషణసేసి యాడితివి మోదంబొప్ప నా దేవితో,
నడువన్ గల్గితివామె యానలకు లోనై నీవు, మోక్షంబనన్
వెడిగా వేరొకటుండునే! గురుతపస్వీ! .. 11

శ్రీరామకృష్ణప్రభూ! గురుతపస్వీ! నీవు జడమగు రాతిని పూజించి, అందు పరదేవతయైన కాళికాదేవిని సందర్శించి, ఆమెతో సంభాషణ సలిపి, ఆ దేవితో నానందముగా ఆడుకొని, ఆమె ఆజ్ఞలను పాటించితివిగదా! ఈ యానందముకంటె ముక్తివేరుగ నున్నదా?

మ. అవినేతుల్ గుణదూరులై బుధుల నన్యాయంబుగా బాధ సే
య విలోకించుచు శిష్టరక్షణము సేయన్, దుంపగా దుష్టులన్

అవతారంబుల దాల్చుచుందువు సదా యత్యంత వాత్సల్యమై
స్తవనీయుండవు భక్తరక్షకుడవీశా! ·· 12

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! నీతిదూరులై, గుణరహితులైన వారు, మంచివారిని అన్యాయముగా బాధించుచుండుట గాంచి, అత్యంత వాత్సల్యమున శిష్టరక్షణ దుష్టశిక్షణల గావించుటకై అవతారముల ధరించు భక్తరక్షకుడవు, స్తుతిపాత్రుడవును నీవే సుమా!

మ· పరిణామక్రమమొప్ప పాదములు నా భాగంబులేలేని భీ
కర మత్స్యాకృతి దాల్చి, నాల్గు పాదములు, గంఠంబుతో
గూర్మమౌ
చు, రజోబుద్ధి వరాహరూపమమగుచున్, శూరత్వమున్ గల్గుశ్రీ
నరశింహాకృతి దాల్చితే ప్రతిభనన్నా! ·· 13

శ్రీరామకృష్ణప్రభూ! ఆ నీ అవతారములుకూడా ఒక క్రమ విధానమునే సూచించుచున్నవి· ప్రథమమున కరచరణాద్యవయవ విభాగములేని మత్స్యరూపమును ధరించితివి· అంత నాలుగు పాదములు, కంఠము కలిగిన కూర్మరూపమును పొందితివి· ఆపై రజోగుణాధిక్యమున వరాహరూపమును దాల్చితివి· పిదప శూరత్వమును గలిగి, సింహ, మానవ ఏకత్వముచే నరసింహాకృతిని ధరించితివి·

మ· చదువన్ నేర్చితివంత వామనుడవై శాస్త్రంబులన్ వేదకో
విదులెల్లన్నుతియింప, ద్రుంచితివి పృథ్వీనాథులన్ మూర్ఖులన్
విదితాధ్యాత్మికకోపపూరితమహావేశంబునన్ భార్గవా!
ఉదయంబాది దొసంగులెంచుట గుణంబో! ·· 14

శ్రీరామకృష్ణప్రభూ! శాస్త్రార్థముల బఠించి, వేదపండితులచే నుతింపబడి వామనమూర్తివి అయితివి· అంత మూర్ఖులైన రాజవర్యులను సంహరించుటకు మహాక్రోధావేశముల పొంది, పరశురాముని అవతారమును ధరించితివి· కాని భార్గవా! దోషముల గాంచుట సద్గుణము కాదు సుమా!

శా· కైవల్యస్థితి బొంద నిచ్ఛ గలుగన్, గార్హస్థ్య ధర్మంబులన్
ప్రావీణ్యంబుగ నిష్ఠతో జరిపి, సర్వాదర్శకత్వంబునన్
నీవా కర్మపథంబు ద్రొక్కితివి సందేహింపకో రాఘవా!
ఆ విద్యల్ తుదకున్ ఫలించెగద దేవా! ·· 15

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నీవు రాముడవై, కైవల్యస్థితిని పొందు కోరిక బుట్టొంద, గృహస్థధర్మముల నతి ప్రావీణ్యముగ నిష్ఠతో నాచరించి, సర్వాదర్శముతో నీవు ఆ కర్మమార్గము ననుసరించితివిగదా! రాఘవా! ఆ విద్యలుకూడ ఫలించినవిగదా!

శా· ప్రేమంబున్గొని యంత కాంక్షలను తత్ప్రేమంబుతో ద్రుంచి ని
ష్కామత్వంబున గర్మలన్ జరిపి, రాసక్రీడ నృత్యాదిచే
సామాన్యుల్ గ్రహియింప జూపితివిగా సద్భక్తిమార్గాల ని
ష్కామత్వంబు పునాది భక్తికని కృష్ణా! ·· 16

శ్రీరామకృష్ణప్రభూ! నీవు శ్రీకృష్ణుడవై, ప్రేమయొక్క అర్థమును వివరించి, ఆ ప్రేమతో కోరికలను నశింపజేసి, కర్మములను నిష్కామముగ జేసి, రాసక్రీడాదికములందు భక్తియొక్క పరాకాష్ఠను సామాన్యులకు దెలియపరచితివి· కృష్ణా! నిష్కామకర్మ, భక్తికి పునాదియను రహస్యమును నిరూపించితివిగదా!

శా· జ్ఞానంబేర్పడ నంత త్యాగివయి, సన్న్యాసంబు గైకొంచు, అ
జ్ఞానంబెల్లర సమ్ముఖంబునకు బ్రజ్ఞామూర్తివై జేర్చి, య
జ్ఞానాంధంబును జీల్చివైచితివి నిష్ఠాసిద్ధి బుద్ధుండవై
జ్ఞానంబన్నను భక్తిసంభవముగాగన్ ·· 17

శ్రీరామకృష్ణప్రభూ! నీవు బుద్ధుడవై, వివేకముతో త్యాగివై, సన్న్యాసమును స్వీకరించి, ప్రజ్ఞామూర్తివై, అజ్ఞానాంధకారమును చీల్చి, ఆ జ్ఞానము నెల్లరికి బంచితివిగదా! జ్ఞానము భక్తిజనితమని ప్రకటించితివి·

శా· సిద్ధార్థుంబలె బోధసేయవలె నా చింతామతిన్ వీడి, యే
రాద్ధాంతంబులులేక త్యాగివి పరబ్రహ్మంబవాద్యుండవై,
సిద్ధాత్ముండవు శ్రీజగద్గురుడవై శ్రీరామకృష్ణుండవై,
ఇద్ధాత్రిన్నవతారవంద్యుడవు స్వామీ! ·· 18

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! బుద్ధునివలె బోధచేయవలయు నను భావమును దూరీకృతము గావించి, ఏ రాద్ధాంతములు చేయక, త్యాగివై, పరబ్రహ్మమై, ఆద్యుడవై, సిద్ధిస్వరూపుడవై, జగద్గురుడై, అవతారవంద్యుడవై, యీ లోకమున శ్రీరామకృష్ణునిగ అవతరించితివి·

మ· జలరాశిన్ గల వారిబిందువుల, నీ క్ష్మామండలిన్ గల్గు జీ
వుల, నక్షత్రసమూహమున్ జగతి సంభూతంబులౌ యాకులన్
సులభంబే యగు నెంచ, గాని గుణసంశోభన్ విరాజిల్లు నిన్
వలనౌనే గణియింప బ్రహ్మకును దేవా! ·· 19

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! సముద్రమున గల జలబిందువులనైనను లెక్కింపవచ్చును· లేక భూమిపై సంచరించు జీవరాశినైనను గణింపవచ్చును· లేక నక్షత్రసమూహమునైనను లెక్కపెట్టవచ్చును· లేక ప్రపంచమునగల వృక్షముల ఆకులనైనను ఎంచుట సులభమే యగుచున్నది· కాని సుగుణములచే వెలుగొందు నిన్ను గ్రహించుటకు బ్రహ్మకును అసాధ్యమే యగుచున్నది·

శా· బాలుండౌ యదునందనుండు తన దేవత్వంబు రూపింపగా
లీలన్ మార్చె శరీరమున్నటులె యుత్కృష్టంబుగా నీవు నీ
లీలామానుషతత్త్వమున్ దెలుప శారీరాకృతిన్ భారమున్
బాలత్వంబున మార్చి చూపితివి దేవా! ·· 20

శ్రీరామకృష్ణప్రభూ! తన దేవత్వమును నిరూపించుటకై బాలకృష్ణుడు తన శరీరమును ఒకసారి తేలికగను, మరియొకపరి

బరువుగను చేసినటు, నీవును బాల్యముననే నీ లీలలయొక్క ఉత్కృ
ష్టతను చాటుటకై, శరీరమును మార్చి చూపించితివిగదా!

మ· మధుపంబెట్టుల సర్వపుష్పమధువున్ మాధుర్యమున్ గ్రోలియం
త·ధరిత్రిన్ ముదమొందునో యటుల తత్త్వార్థప్రదానంబునా
సుధ భక్షింప మతంబులన్ దిరిగి శ్రీశున్ బొంది నిత్యుండవై
బుధలోకస్తుతి నొందినావుగద శంభూ! ·· 21

శ్రీరామకృష్ణప్రభూ! శంభూ! తేనెటీగ లోకమునందలి స
మస్తపుష్పములగల మకరంద మాధుర్యమునుగ్రోలి ఆనందించు
రీతిగ నీవును సకలమతముల నన్వేషించి, అందలి తత్త్వార్థసంయు
తమైన అమృతమునాస్వాదించి, భగవానుని సందర్శించి, నిత్యు
డవై, పండితవర్యుల మన్ననల నందుకొనియుంటివిగదా!

మ· చదువన్ వ్రాయగలేని నీ వుపనిషచ్ఛాస్త్రార్థసారంబులన్
విదితంబౌనటు దెల్పుటల్, గురువరుల్, విద్యాధికుల్, నిన్నుస
మ్ముదమై కొల్చుట, పేదవైన నిను సమ్రాట్టుల్ జమీందార్లు నీ
పదముల్ బట్టుట చాల చిత్రములు దేవా! ·· 22

శ్రీరామకృష్ణప్రభూ! చదువుటగాని, వ్రాయుటగానిరాని
నీవు, ఉపనిషత్తులను, శాస్త్రార్థసారములను సర్వులకు సుగమ
ముగ బోధించుటయు, మరియు విద్యాధికులు, గురువర్యులు
నిన్ను కొలుచుటయు, పేదవైన నిన్ను జమీందార్లు, సామ్రాట్టులు
నీపదసన్నిధిని కొలువుండుట ఆశ్చర్యముగదా దేవా!

శా· ద్వైతాద్వైత విశిష్టపద్ధతుల, శైవాద్వైత శాక్తంబులన్,
శ్రౌత స్మార్తము బౌద్ధ క్రైస్తవము స్లామాది మార్గాల భా
వాతీతంబుగ బొంది యా యనుభవంబాసాంతమున్ గాంచు నిన్
జేతన్గాదు వచింపగా గురుతపస్వీ! ·· 23

శ్రీరామకృష్ణప్రభూ! గురుతపస్వీ! ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శైవ, శాక్త, శ్రౌత, స్మార్త, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయాది మతసాధనల నాసాంతము ఆచరించి, భావాతీతానుభవమును పొందిన నిన్ను నేను వర్ణింపలేనుసుమా!

మ॥ కనకంబొండు కరంబునందునిచి, వేడ్కన్ మంటి వేరొక్కటిన్
గొని శ్రేష్ఠంపు విచారణాపరతి సాంగోపాంగసుజ్ఞానవా
హినులన్ మున్గి సమత్వదృష్టి గని, రెండింటన్ సమానత్వమున్
గను వైరాగ్యము నెంత నెంతును శుభాంగా! .. 24

శ్రీరామకృష్ణప్రభూ! శుభాంగా! ఒక చేతిలో బంగారమును మరియొక చేతిలో మట్టిని గ్రహించి, చక్కగ విచారణసలిపి సమత్వమును గాంచి, యథార్థ సుజ్ఞానప్రవాహమున లయించిన నీ సమత్వవైరాగ్యముల వర్ణించుటకు సాధ్యమా!

మ॥ తన పాదంబులదాకి రాతినట కాంతన్ జేసె రాముండు, కు
ష్ఠిని గౌరాంగుడు కౌగిలించి బలియన్ జేసె, రోగంబులన్
దన హసంబుల దాకి క్రీస్తు తరిమెన్, దర్కింప నవ్వెంతవౌ
మునుచేన్ మీ కరముల్ సమాధులలో మమ్ముంచన్ .. 25

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీరాముడు తన పదముల నంటిన రాతిని కాంతనుగ చేసెను. శ్రీ గౌరాంగమహాప్రభువు కుష్ఠురోగిని కౌగిలించుకొని ఆ వ్యాధిని నశింపజేసెను. ఏసుక్రీస్తు తన హస్తముచే స్పర్శించి రోగములను దూరీకృతము గావించెను. కాని ఆలోచించిన వానిలో గొప్పదనమేమున్నది? నీ కరస్పర్శయో మాకు సమాధి సంస్థితులను కలిగించునుగదా!

మ॥ చిరుప్రాయంబున నేవు తత్త్వగుణసుశ్రీజెంది, సంసారమా
కరుణాన్వితచరిత్ర కాళికిడి, భక్త్యంబోధిలో మున్గి, భీ
కరతత్త్వార్థతరంగఘాతముల మోక్షప్రాప్తికై పొంది, స
త్వరమా బ్రహ్మము నొందవే గురు! మహాత్మా! .. 26

శ్రీరామకృష్ణప్రభూ! గురూ! మహాత్మా! బాల్యముననే నీవు సుగుణముల గడించి, భక్తిసంద్రమున మునిగి, సంసారమును కరుణామూర్తియగు కాళికాదేవికి యిడి, భయంకరమైన తత్త్వార్థములను తరంగముల మోక్షప్రాప్తికి ఉపయోగించి, శీఘ్రముగ నా బ్రహ్మస్వరూపమును పొందియుంటివిగదా!

మ· గురుడా! ఏడవఏట క్షేత్రముల బక్షుల్ కృష్ణ మేఘంబుపై
దిరుగాడన్ గని, కృష్ణదర్శనమునన్ దివ్యంబు, పూర్ణంబు, భా
స్వరమౌ భావసమాధి భాగ్యము ప్రపంచాతీతమై పొందవే
పరమాత్మా! క్షుదిరాముపుత్ర! గురుదేవా! ·· 27

శ్రీరామకృష్ణప్రభూ! గురుదేవా! పరమాత్మా! క్షుదీరాము పుత్రా! నీవు ఏడవఏటనే పొలముల దిరుగుచు, నల్లని మేఘముపై తెల్లని పక్షులు ఎగురుటను గాంచి, అట కృష్ణుని దర్శించి, ప్రకాశమై, దివ్యమై, పూర్ణమై, ప్రపంచాతీతమైన భావసమాధి భాగ్యమును పొందియుంటివిగదా!·

మ· శివవేషంబునుదాల్చి, జ్ఞానమయమౌ చిద్రూపమున్ జూచి, మా
నవ లోకంబున సర్వమున్ మరచి, జ్ఞానానందుడౌ శంకరున్
అవలోకించుచు నైక్యమున్ గనెడు బ్రహ్మానందసంశోభితా!
భవదీయాంఘ్రులకేను మ్రొక్కెదను దేవా! ·· 28

శ్రీరామకృష్ణప్రభూ! బ్రహ్మానందసంశోభితా! దేవా! బాల్యమున శివ వేషమును ధరించి, జ్ఞానమయమగు చిద్రూపమును గాంచి, సర్వమును మరచి, జ్ఞానానందస్వరూపుడైన శంకరుని హృదయమున వీక్షించి, అందు ఐక్యము నొందిన నీపాదపద్మములకు నేను నమస్కరించుచున్నాను·

మ· భగవత్పాదుడు పెండ్లికే వెరచె, స్త్రీపాశాల బద్ధుండు వే
తెగగోసెన్ చిననాడె, వృద్ధుడయి సాధ్వీన్ వీడె రామానుజుం

డు, గుణంబొప్ప సతీమణిం గొనుచు దృష్టుల్ గాంతపై దీసి, పూ
రిగ బ్రహ్మైక్యము జేసివైచితివి శక్తిన్. .. 29
శ్రీరామకృష్ణప్రభూ! శ్రీశంకరభగవత్పాదులు వివాహమన భయమును చెందెను. శ్రీ బుద్ధభగవానుడు చిన్ననాటనే స్త్రీపాశములను త్రెంచివైచెను. వృద్ధుడైన పిమ్మట శ్రీ రామానుజాచార్యులు భార్యను త్యజించెను. కాని నీవో, భార్యను స్వీకరించి, దృష్టుల భార్యపై నుంచక, శక్త్యనుగ్రహమున దృష్టిని అంతర్గతమొనరించి బ్రహ్మైక్యము చేసితివిగదా!

మ. వనమందొక్కదినంబు నీవు విహరింపన్ జూచి శ్రీయేసు, లే
దని భేదంబు నిజమ్ముగా తనకు నీకంమున్ బరిష్వంగమున్
గని నీలో లయమొందె సర్వగురులోకంబెల్ల నీమూర్తిగా
దనరన్ స్పష్టముగా గురూత్తమ! మహాత్మా! .. 30
శ్రీరామకృష్ణప్రభూ! మహాత్మా! గురూత్తమా! నీవు ఒక దినము వనములో విహరించుచుండ, ఏసుక్రీస్తు నీకు దర్శనమునిడి, యథార్థమున 'మనమిరువురము ఒక్కటే భేదములేదు' అని పలికి, కౌగిలించి, సర్వగురువులు నీ మూర్తియే యనుచు నీలో లీనమయ్యెనుగదా!

శా. సాకారంబని విగ్రహంబులకు సాష్టాంగంబు గావించినన్
లోకేశుండెరుంగడా! యంచు గడు సుశ్లోకుండవై గొల్చి నీ
వా కారుణ్యపయోధి గాంచితివి సర్వాకారమూలంబుగా
మీ కార్యంబులమానుషంబులగు స్వామీ! .. 31
శ్రీరామకృష్ణప్రభూ! విగ్రహముల దేవుని సాకారములుగ భావించి, సాష్టాంగము గావించిన నాలోకేశ్వరుడు గ్రహించును గదా యనుచు బూజల సలిపిన, నీవు సర్వాకారములకు మూలమై కరుణాసముద్రుడైన ఆ దేవుని దర్శించితివి. స్వామీ మీ కార్యము లన్నియు మానవాతీతములుగదా!

శా· 'రామా యన్న నిమేషమే చిరుతయై 'రాంలాల' నామంబునన్
నేముందాటలనాడు, కృష్ణుడగుచున్ నేమోఁల సాక్షాత్కరిం
చేమేమో సరసోక్తులాడుగద! 'హే కృష్ణా' నన్, దేవ దే
వా! మీ శక్తి యమానుషంబుగద! వహ్వా! ·· 32

శ్రీరామకృష్ణప్రభూ! దేవదేవా! 'రామా!' యని పిలిచిన వెంటనే రాముడు బాలుడై, 'రాంలాల' నామమున నేముందు ఆటలనాడును· 'హే కృష్ణా!' యని పిలిచినంతనే బాలకృష్ణుడు సాక్షాత్కరించి ఏమేమో సరసోక్తులాడునుగదా! ఆహా! నీ శక్తి అమానుషము సుమా!

మ· 'భగవంతున్ గనుచున్నవాడ నిట విస్పష్టంబుగా, నీవు కో
రగ జూపంగలవాడ'నంచనగ లేరైరెవ్వరున్ దొల్లి, యీ
పగిదిన్ నీ యనుభూతిసంపదను విశ్వవ్యాప్తి గావింప పె
క్కగు శక్తుల్ బ్రకటించినాడవు శుభాంగా! ·· 33

శ్రీరామకృష్ణప్రభూ! శుభాంగా! 'ఇచ్చటనే నేను భగవంతుని సుస్పష్టముగ చూచుచున్నాను· మరియు నీవు కోరినచో ఆ భగవానుని చూపించగలను' అని పూర్వమెవరును పలుకలేదు· ఈ విధముగ నీ అనుభవసంపదను విశ్వవ్యాప్తమొనరింప ననేక శక్తులను ప్రదర్శించియుంటివిగదా!

శా· 'ఏ దేవుండట రాముడై తనరి శ్రీకృష్ణుండుగా నయ్యెనో!
ఆ దేవుండె సు రామకృష్ణుడను నీ యాకారమున్ దాల్చె'నా
యౌదార్యంబున భక్తసంతతికి నీ యాథార్థ్యతన్ జాటితే
ఓ దేవా! నిను నెంతగా బొగడుటో! ఓ ·· 34

శ్రీరామకృష్ణప్రభూ! 'ఏ దేవుడు శ్రీరాముడైయుండి, పిదప శ్రీకృష్ణుడుగానయ్యెనో, ఆ దేవుడే యీ రామకృష్ణుడను రూపమును ధరించెను' అని నీ యథార్థస్థితిని భక్తసంతతికి ఉదారముగ వ్యక్తము చేసితివిగదా! దేవా! నిన్ను ఎంతని పొగడను?

శా· మూడే రోజులలోన బుద్ధు, నటులే మూన్నాళ్ల లో గ్రీస్తు, నా
మూడే రాత్రులలో మహమ్మదు, పరంబౌ నిర్వికల్పంబు నా
మూడే నాడుల· నెవ్వడైన గనెనే పూర్వంబు! దర్శించునో
నేడైనన్! గనగల్గునొక్కొ యికనేనిన్ ·· 35

శ్రీరామకృష్ణప్రభూ! మూడురోజులలో బుద్ధుని, మూడుదిన ములలో క్రీస్తు ను, మూడురాత్రులలో మహమ్మదును, ఆ మూడు రోజులలోనే పరమగు నిర్వికల్పకసమాధినికూడా పూర్వము ఎవర్తైనను పొందియుండిరా? నేడైన దర్శించుదురా? ఇక ముందైనను పొందగలరా?

మ· అవలంబించిరొక్కొక్క మార్గమును గమ్యస్థానమున్ జేర యో
గివరేణ్యుల్ గురులైన, కాని పటుశక్తిన్నీవలెన్ సర్వమా
ర్గవితానాంతములంది సర్వమతసౌభ్రాత్రార్థసందేశసా
రవిశేషంబుల దెల్పగల్గిరె! సుధీరా! ·· 36

శ్రీరామకృష్ణప్రభూ! సుధీరా! యోగివర్యులుగాని, గురువరేణ్యులుగాని, ఒక్కొక్కరు ఒక్కొక్క మార్గమును అవలంబించి, గమ్యస్థానమును పొందిరి· కాని నీవలె శక్తివంతులై, సర్వమార్గ గమ్యముల జేరి, సకలమతసౌభ్రాతృత్వ సందేశసారవిశేషముల తెలుపగలిగియుండిరా?

మ· తొలిజన్మంబుల సల్పి, యోగపథమందున్ జొచ్చి యంతన్‌సుభ
క్తిలతన్ బొంది, యటన్ విరాగయుతశక్తిన్ జ్ఞానతత్త్వాబ్ధిలో
జలకంబాడుచు నిర్వికల్పసుధ నాస్వాదించి బ్రహ్మైక్యస
·త్ఫలమున్ బొందు క్రమంబుజూపితివి దేవా! ·· 37

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! పూర్వమనేకజన్మముల బొంది, యోగమార్గమున ప్రవేశించి, అంత భక్తిలతను పొంది, వైరాగ్యముతోకూడిన శక్తిచే జ్ఞానతత్త్వసాగరమున మునుగుచు, నిర్వికల్ప సుధ నాస్వాదించి, బ్రహ్మైక్యమను సత్ఫలమును సాధించు క్రమ

విధానమును చూపించితివిగదా!

మ. పదముల్ శారదయున్, నరేంద్రుడు సదా భక్త్యుక్తి సేవింప, శా
రద గంగాధర శశి రాఖల హరుల్ శ్రద్ధాళులై గొల్వ, స
మ్ముదమై తారక కాళి యోగ హరులున్ బూజింప, నానందసం
పద శోభిల్లెడు నీకు దండములు దేవా! .. 38

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నీ పదములను శారద నరేంద్రులు భక్తితో సేవింప, గంగాధర, శశి, రాఖల్, హరి, శరత్తులు నిన్ను శ్రద్ధతో గొలువ, హరి, యోగి, కాళి, తారకులు నిన్ను ఆనందముతో బూజింప నానందసంపదలతో శోభించు నీకు నమస్కారము.

మ. చదువన్ మానితివేల? వామనుడవై శాస్త్రంబులన్ నేర్చి, నీ
పదపద్మంబుల రాక్షసేశ్వరునిచే బట్టించుటల్ వ్యర్థమో!
పదవిభాగము తర్కశాస్త్రములకున్ బర్వెత్తుటల్ రిక్తయో!
మదిలో నేమని యెంచితోగద మహాత్మా! .. 39

శ్రీరామకృష్ణప్రభూ! వామనావతారమున శాస్త్రముల బఠించి, నీ పాదపద్మముల రాక్షసేశ్వరునిచే బట్టించుకొనుట వ్యర్థమని భావించితివా? లేక తర్కశాస్త్ర పదవిభాగముల చేయుట అనవసరమని ఎంచితివా? ఏమని భావించితివోమరి! మహాత్మా! అసలు చదువుట మానితివేమి?

శా. ఔరా! భార్గవమూర్తివై మునుపు దుర్వ్యాపారులౌ రాజులన్
నీ రోషాతికరాళఖడ్గమున నీ నేర్పొప్ప ఖండింపవే!
ఆ రోషంబెటువోయె! సత్వగుణమే యత్యుత్తమంబెంచితో
వైరాగ్యప్రతిభాస్వరూప! గురుదేవా! .. 40

శ్రీరామకృష్ణప్రభూ! వైరాగ్యప్రతిభాస్వరూపా! గురుదేవా! పూర్వము భార్గవరాముడవై, దుష్టులగు క్షత్రియులను రోషముచే

భీకర ఖడ్గముతో ఖండించితివిగదా! ఔరా! నేడు ఆ రోషమేమ యెృను? సత్వగుణమే ముఖ్యమని భావించితివా?

మ· మును శ్రీరాముడవై, యనేక విభవమ్ముల్ గల్గి, గార్హస్థ్య ధ
ర్మనికాయంబుల సల్పి, నేడఖిల కర్మత్యాగివై యుండుటే
మి? నిరాఘాటసమాధి సంస్థితుల జెల్మిన్ బొంద గర్మంబు ల
డ్డని నిర్ధారణ జేసితేమొగద! ఈశా! ·· 41

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! మునుపు శ్రీరామచంద్రుడవై, అనేక వైభవములతో గృహస్థధర్మముల బాటించిన నీవు, నేడు సర్వ కర్మత్యాగివై యుండుటకు కారణమేమి? నిరాటంకముగా సమాధి సంస్థితుల పొందుటకు కర్మములు ఆటంకములైనవేమో!

మ· జవరాండ్రన్ దరిజేర్చి, నిత్యమును రాసక్రీడలన్ మున్గి,ప్రా
భవమ్మై కాంచనచేలధారుడగు గోపాలుండవై యుండి, యే
మి? విచిత్రంబుగ గామినీకనకమున్ మిథ్యావిధిన్ జూచి నీ
వు విసర్జించుటకేమికారణము? శంభూ! ·· 42

శ్రీరామకృష్ణప్రభూ! శంభూ! నాడు శ్రీకృష్ణుడవై, యౌవనవతుల దరిజేర్చి, నిత్యము రాసక్రీడాదికమున మునిగి, వైభవోపేతుడవై, కాంచనచేలధారివైన నీవు, నేడు ఆ కామినీకాంచనముల మిథ్యగ భావించి, వానిని త్యజించుటకు కారణమేమి?

మ· పలు కష్టంబులకోర్చి బ్రహ్మమును సంపాదింప, యత్యంత ని
ర్మలసుజ్ఞానసుగంధమెల్లెడల గ్రమ్మన్ రాజనోద్రేకచ
ర్యల దేశమ్ముల ముంపజాలు నల సిద్ధార్థుండవై యుండి, యీ
కలిలో సర్వము ద్రోసివైచితివి రంగా! ·· 43

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! పూర్వము సిద్ధార్థుడవై, బహుకష్టముల నోర్చుకొని, బ్రహ్మజ్ఞానివై, ఆ నిర్మలసుజ్ఞానసువాసనల వ్యాపింపజేయుటకై రజోగుణమున దేశమంతట బర్యటించిన నీవు

యీ కలిలో సర్వమును విడిచిపెట్టితివిగదా!

మ· అదుగో! పక్షులు పాటబాడు, స్వరమా యంబోధియే వేసె, నీ
రధముల్ మ్రోగె మృదంగరూపమున దాళంబో, యదేకోకిలం
బిదియా పాటకచేరి, యా ప్రకృతి నీకేర్పాటుగావించి, తా
ముదమున్ బొందునుగాదె దేవ! యనిశమ్మున్ ·· 44

శ్రీరామకృష్ణప్రభూ! అదుగో! పక్షులు పాడుచున్నవి· సముద్రము స్వరము వేయుచున్నది· మేఘములు మృదంగమువలె మ్రోగుచు తాళము వేయుచున్నవి· కోకిల పాడుచున్నది· దేవా! ప్రకృతి యిట్టి సంగీతమును నీకు ఏర్పరచి ఆనందించుచున్నదిగదా!

శా· సత్యాన్వేషణతీవ్రతత్త్వయుతుడై, సర్వంబు వర్జించుచున్
నిత్యానందమయస్వరూపుడగుచున్ నిండారు ప్రేమంబుతో
నత్యంతప్రభ నిర్మలాత్ముడయి జ్ఞానజ్యోతియై సిద్ధుడా
శ్రీత్యాగిన్ గొలుతున్ వివేకుని ప్రశస్తిన్ ·· 45

శ్రీరామకృష్ణప్రభూ! తీవ్ర సత్యాన్వేషణమును గావించి, సర్వమును త్యజించి, నిత్యానంద స్వరూపుడై, ప్రేమమూర్తియై, అత్యంతనిర్మలుడై, జ్ఞానజ్యోతియై, సిద్ధుడై, త్యాగియైన వివేకానందుని పూజించుచున్నాము·

మ· తనగంభీరవచోప్రవాహముల తత్త్వార్థంబు పొంగార, భీ
తిని యాకాశము తల్లడిల్లుకరణిన్ దేదీప్యమానంబుగా
ఘనుడై, పృథ్వి జలింపజేసిన వివేకానందయోగిన్ సమ
స్త నరేంద్రప్రియు గొల్చి మ్రొక్కెద సురేశా! ·· 46

శ్రీరామకృష్ణప్రభూ! సురేశా! తన గంభీర వాక్ప్రవాహమున తత్త్వార్థము పొంగా, భయమున ఆకాశము తల్లడిల్లగా, ప్రకాశస్వరూపుడై, ఘనుడై, భూమిని చలింపజేసిన, సమస్త నరేంద్రప్రియు

డైన శ్రీ వివేకానందయోగికి నమస్కరించుచున్నాను.

శా. ఖద్యోతద్యుతిమించు దీప్తులను బ్రఖ్యాతిన్ దిగంతంబులన్
సద్యోగంబున ముంచి తేల్చు ప్రతిభాసామ్రాట్టనన్, బ్రహ్మస
ద్విద్యారణ్యవిహారకేసరివలెన్ వేదాంతగర్జార్భటిన్
అద్యుండైన వివేకు గొల్చెద మహాత్మా! .. 47

శ్రీరామకృష్ణప్రభూ! సూర్యకాంతికిమించు తేజముతో, దిగంతముల నిండిన ప్రఖ్యాతితో, సద్యోగమున మగ్నత నొందించు ప్రతిభాసామ్రాట్టువలె, బ్రహ్మసద్విద్యారణ్యవిహార వేదాంతకేసరివలె గర్జించుచు, ప్రథమస్థానమును పొందిన శ్రీ వివేకానందుని పూజించుచున్నాను.

శా. ఆనందామృతధారలో యనగ నిర్వ్యాజప్రపూజ్యంబులై
మౌనీంద్రప్రతిపన్నతత్త్వరససంపన్నప్రవాహంబులో
జ్ఞానోద్రేకజనిర్మలస్ఫురితసూనస్తుత్యవర్షంబనన్
దేనెల్ జిల్కు వివేకు వాక్యములు శక్తిన్ .. 48

శ్రీరామకృష్ణప్రభూ! ఆనందామృతధారలై, అవ్యాజప్రపూజితములై, మౌనివర్యులచే బ్రతిపాదితమైన తత్త్వరససంపన్నప్రవాహములై, జ్ఞానోద్రేకజన్యములై, నిర్మలములై ప్రకాశించిన సుమవర్షమువలె శ్రీవివేకానంధుని వాక్యములు శక్తివంతములై, తేనెలూరించుచున్నవిగదా!

మ. అనఘా! మారుతి యబ్ధి దాటి పటుశౌర్యస్థైర్యగాంభీర్య శ
క్తి నిధిన్ రాముని రాజ్యమున్ నిలుపుమాడ్కిన్ రామకృష్ణార్య పా
లన స్థాపించి యఖండ దిగ్విజయమై రంజిల్లి ప్రఖ్యాతుడై
న నరేంద్రున్ ఘను సన్నుతింతుగద యన్నా! .. 49

శ్రీరామకృష్ణప్రభూ! అనఘా! శౌర్య, స్థైర్య, గాంభీర్య, శక్తులుగల శ్రీరామచంద్రుని రాజ్యమును నిలుపుటకు మారుతి సం

ద్రిమును లంఘించినట్లు అఖండదిగ్విజయముతో ఆనందముగ శ్రీ రామకృష్ణగురుదేవుని పాలనమును సంస్థాపించిన ప్రఖ్యాతుడును, ఘనుడును అయిన నరేంద్రుని స్తుతించుచున్నాను.

మ. జనకున్ బోలినయోగి, శంకరువలెన్ శాస్త్రజ్ఞుడున్, బుద్ధురీ
తిని బ్రేమాబ్ధియు, గౌరుమాడ్కి ఘనభక్త్యుక్తుండు, జ్ఞానంబునన్
గనగా శ్రీశుకదేవుడయ్యెడు వివేకానందు వర్ణింప నా
కనువౌనే! అమరేంద్రసన్నుత! పరాత్మా! .. 50

శ్రీరామకృష్ణప్రభూ! అమరేంద్రసన్నుతా! పరాత్మా! జనకునివలె యోగియు, శ్రీశంకరునివలె శాస్త్రజ్ఞుడును, బుద్ధుని పగిది ప్రేమస్వరూపుడును, గౌరాంగునివలె మిక్కిలి భక్తియుక్తుడును, శుకమహర్షిచందము విజ్ఞానియునైన వివేకానందుని వర్ణించుట నాకు సాధ్యమా!

శా. నీ చారిత్రము నీ మహామహిమయున్ నీ మార్గముల్ వాక్యముల్
నీ చైదమ్ములు నీదు భక్తిరతియున్ నీ మూర్తి నీ సిద్ధులున్
నీ చందంబు తపంబు ప్రేమ దయయున్ నీ జ్ఞానమున్ వెంచు శౌ
రీ! చేమోడ్చనివాడు మానవుడొకో! శ్రీ .. 51

శ్రీరామకృష్ణప్రభూ! శౌరీ! నీ చరిత్ర, నీ గొప్పదనము, నీ మార్గము, నీ వాక్యములు, నీ కార్యములు, నీ భక్తితత్త్వము, నీ మూర్తిమత్త్వము, నీ సిద్ధులు, నీ తపస్సు, నీ ప్రేమ, నీ దయ, నీ జ్ఞానముల శ్రవణము జేయుచు, నమస్కరింపనివాడు మానవుడగునా?

మ. జగతీనాథుడవై, యనంతసుఖనిష్పాందప్రకీర్తుండవై,
నిగమజ్ఞానయశోవిరాజితగుణానేకంబుచే నొప్పి, స
త్య గభీరప్రతిభావిభూషితము నిత్యానందవైరాగ్యత
త్త్వగుణోపేతుడవౌట నేదిడుదు దేవా! .. 52

శ్రీరామకృష్ణప్రభూ! జగన్నాథుడవై, అనంతసుఖసముదాయ
ముతో, వేదవిజ్ఞానముచే ప్రకాశించిన సుగుణములతోకూడియుం
డుటచేతను,సత్యగంభీరప్రతిభచే నలంకరింపబడిన నిత్యానందవైరాగ్య
గుణరాశివగు నీకు ఏమివ్వగలను దేవా!

శా. లోకానన్ గల సర్వపుష్పచయముల్ లోకేశ్వరా! నిత్యమున్
నీ కంఠంబున దివ్యహారములుగా నేత్రోత్సవంబౌచు నీ
యాకారంబు నలంకరింప నిక బుష్పాళిన్ సమర్పింప నె
ట్లో? కళ్యాణసుఖప్రదా! పరమహంసా! .. 53

శ్రీరామకృష్ణప్రభూ! కళ్యాణసుఖప్రదా! పరమహంసా! లోకే
శ్వరా! లోకమునగల సమస్తసుమసంచయము నీ కంఠమున
దివ్యహారములై, కంటికింపుగ నీమూర్తిని సదా అలంకరించుచుండ
నీకు పుష్పముల నెట్లు సమర్పింపగలను?

మ. భువిలోనున్నవి, మింటనున్నవి, మహాంభోరాశిలోవన్ని, వా
యువులో నున్నవి, సర్వవిశ్వములలోనుద్భూతమౌ సర్వ వ
స్తువులన్ గల్గుచు రాజశేఖరుడవై శోభిల్ల, నీకేను యె
య్యవి యర్పింపగజాలువాడ మహనీయా! .. 54

శ్రీరామకృష్ణప్రభూ! మహనీయా! భువిలో, సాగరములో,
వాయువులో, మరియు సర్వవిశ్వమున జనించిన సకల వస్తుసంప
దల పొంది, రాజశేఖరుడవై ప్రకాశించు నీకు నేను ఏమి అర్పిం
పగలను స్వామీ!

మ.. విరహోద్వేగజతీవ్రవేదనభరావిర్భూతమౌ నా మహ
త్తర బాష్పంబుల నేదు కీర్తన జపధ్యానంబులన్ దేలుచున్
బరితృప్తిన్ గనగల్గు నశ్రుతతి నే బాళాలు గావించి, యో
వరదా! నిన్నభిషిక్తు జేసెదను దేవా! .. 55

శ్రీరామకృష్ణప్రభూ! వరదా! నీ విరహముచే దీవ్ర ఆవేదన కలిగి, ఆ యావేదనాజన్యమైన నావేడి కన్నీటిని, నీ సంకీర్తన, జప ధ్యానముల మునుగుటచే బహిర్గతమైన చల్లని నా కన్నీటిని సమ పాళ్లు చేసి, నిన్ను అభిషేకించగలను.

శా. నీకై వేడ్కతొ గామపాంశువులనే నిర్మూలమున్ జేసి, వే
దాకారా! పరిశుద్ధిగా దుడిచి, శ్రద్ధాభక్తులన్ ముగ్గులన్
నీ కారుణ్యముచేత బెట్టి, యిట మాణిక్యంపు హృత్పద్మమున్
నీకై యుంచితి కూరుచుండుమికనేనిన్ .. 56

శ్రీరామకృష్ణప్రభూ! వేదాకారా! కోర్కెల అణుసముదాయ మును నిర్మూలించి, శుభ్రముగా దుడిచి, నీ దయతో శ్రద్ధాభక్తు లను ముగ్గులనుపెట్టి, మాణిక్యములతోకూడిన నా హృదయపద్మ మును నీ కొరకు ఉంచియున్నాను. ఇక ఆసీనుడవు కా.

మ. సుగుణానీకసుమంబులే పరిమళస్ఫూర్తిన్ సుగంధంబులన్
దగు రీతిన్ బ్రసరింప భక్తిమెయి పాదాబ్జంబులన్ బ్రస్తుతిం
చి గగుర్పాటుల నొందుమన్, సకల సౌశీల్యప్రవిష్టుండవౌ
జగదేకస్తవనీయ! గొల్తునిక నిచ్చన్ .. 57

శ్రీరామకృష్ణప్రభూ! జగదేకస్తవనీయా! పరిమళస్ఫూర్తితో సుగంధముల వెదజల్లు నా సుగుణములనే పుష్పములను భక్తితో నీ పాదాబ్జములకు అర్పణముజేసి, సకల సుగుణములతో నలరారు నిన్ను గగుర్పాటుతో, ప్రీతితో పూజింతును.

మ. నయనద్వంద్వమునుండి జారు మహదానందాశ్రుముక్తావళుల్
ప్రియుడా! నీ యురమందు హైతుసుమ నీ పీతాంబరంబౌనుసం
దియమే లేదిక నాదు భక్తి, యట, నీ దేహాన శ్రీచందనం
బయి నా సత్వగుణంబు రాజిలెడు దేవా! .. 58

శ్రీరామకృష్ణప్రభూ! ప్రియుడా! అధికానందముతో నా నేత్రములనుండి ప్రవహించిన ఆనందాశ్రువులనే ముత్యములను నీ కంఠమున వేయగలను. నా భక్తియే నీకు పీతాంబరము. దేవా! నీ దేహమునకు శ్రీచందనము నా సత్వగుణమేసుమా!

మ. కదళీ యామ్రము నారికేళ పనసల్ గల్కండలున్ బప్పులున్
మొదలౌ యల్పపు వస్తులన్నెటుల నే ముందుంతు? హాస్యాస్పదం
బది! అర్పింపగ నన్యమేదిగలదో యావంతయున్ దోచదే!
పదపద్మంబుల మ్రొక్కువాడ చెపుమప్పా! .. 59

శ్రీరామకృష్ణప్రభూ! అరటిపండ్లు, కొబ్బరికాయలు, పనస పండ్లు, కలకండ, పప్పులు మొదలైన వస్తువుల నీకెట్లు అర్పింపగలను? ఎంత హాస్యాస్పదమోగదా! నీకు యిచ్చుటకు అన్యమైన పదార్థములు ఏమియో తెలియుటలేదు. నీ చరణములకు నమస్కరించుచున్నాను తండ్రీ! చెప్పుము.

మ. అరిషడ్వర్గముబట్టి నేదు గురుపాదాబ్జంబు ముందుంచి, భీ
కర శక్తిన్గల జ్ఞానఖడ్గమున ముక్కల్ జేసి, నీ మ్రోల నా
కరముల్ మోడ్చి, భజించి, నేడు నీ ఖాద్యంబులన్ భక్తితో
పరమేశా! దయతోడ గైకొనుము దేవా! .. 60

శ్రీరామకృష్ణప్రభూ! పరమేశా! దేవా! నాకు గల కామాద్యరిషడ్వర్గమును బంధించి, నీ పాదములచెంత నుంచి, మహాశక్తియుతమైన జ్ఞానఖడ్గముచే వానిని నీముందు ముక్కలుజేసి, భక్తితో పూజించి, నమస్కరించి, నీకు వానిని నివేదించగలను. దయతో వానిని స్వీకరించు తండ్రీ!

మ. గురుదేవుండవు నీవ, నీవ చెలియున్, గోముప్ప బిడ్డండవున్
ఇరవౌ తల్లివి నీవె, తండ్రియు నీవె, నాదు యాదర్శమున్

పరమాత్ముండవు నీవె, సర్వమవు నా ప్రాణంబవున్నీవె శ్రీ
హరి! నీకంటెను నాకు దిక్కెవరు దేవా! .. 61

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీహరీ! నీవే గురుదేవుడవు, స్నేహితుడవు, బిడ్డవు, తల్లివి, తండ్రివి, నీవే నా ఆదర్శము, నీవే పరమాత్మవు, నీవే నా ప్రాణము, నీవే నా సర్వస్వము. నీకంటె నాకు దిక్కెవరున్నారు దేవా!

మ. పటమందున్నిను గాంచునంతటనె సంప్రాప్తించు సాలోక్యమం
తట నీ దివ్యచరిత్రమున్ వినగ సందర్శించు సామీప్యమే,
అట్టుపై నీ యుపదేశముల్ జరుపగా సారూప్య సాయుజ్య సం
పుటి ప్రాప్తించును భక్తసంతతికి శంభూ! .. 62

శ్రీరామకృష్ణప్రభూ! పటమునందు నిన్ను గాంచుటచే సాలోక్యముక్తి లభిస్తుంది. అంత నీ దివ్యచరిత్రమును శ్రవణము చేయగా సామీప్యముక్తి ప్రాప్తిస్తుంది. అట నీ యుపదేశముల నాచరించిన భక్తసమూహామునకు, సారూప్యసాయుజ్యముక్తి ద్వయము సంప్రాప్తించునుగదా!

శా. దోసంబుల్ బహుళంబులయ్యెననఘా దూషింపగా వద్దు, మేల్
బాసల్ రావిక నేమిసేతు? గనుకన్ బాలింప నన్ గాంచి, దే
వా సప్రీతి విషంబు నిర్జరులకై భక్షించునట్లీవు నా
యాసల్ దీర భుజింపు దోషముల నీశా! .. 63

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! దోషములు అధికం అయినవని నన్ను దూషించవద్దు. ఇంతకంటె నేను ఏమియు చేయలేను. దేవా! అనఘా! కాని నీవు దేవతలకై విషమును భుజించినట్లు నా దోషములను నీవు భక్షించి, రక్షింపుము.

శా. సర్వవ్యాపకుడై మహామహిముడై, సర్వాంతరజ్యోతియై
సర్వజ్ఞత్వవిశేషుడై, యనుపమైశ్వర్యప్రభాపూర్ణుడై,

సర్వేశానుడునై విరాజిలెడు సాక్షాద్బ్రహ్మమౌ నీకు నే
సర్వంబర్పణ జేసి మ్రొక్కెద మహేశా! ..  64

శ్రీరామకృష్ణప్రభూ! మహేశా! సర్వవ్యాపకుడవై, మహామహుడవై, సర్వాంతరజ్యోతివై, సర్వజ్ఞత్వాదిగుణవిశేషుడవై, అసమాన ఐశ్వర్యప్రభాపూర్ణుడవై, సకలప్రశాసనుడవై, సాకాద్బ్రహ్మస్వరూపుడవై ప్రకాశించు నీకు సర్వార్పణము జేసి నమస్కరించుచున్నాను.

మ. ఉదధిన్ బూర్వపు గర్మపరిపాకోద్భూతయోగంబునన్
బదముల్ జారగ బడ్డ పుర్వువలె గూపంబౌ ప్రపంచంబునం
దిదిగో జారితి, దుఃఖినైతి గడు భోగేచ్ఛన్ జరించెను నీ
పదముల్ బట్టితి రక్షసేయుమిక దేవా! ..  65

శ్రీరామకృష్ణప్రభూ! సాగరమునబడిన కీటకమువలె నేనును, పూర్వజన్మకర్మపరిపాకవశమున యీ లోకమను కూపమున జారి పడియుంటిని. భోగేచ్ఛతో మిక్కిలి దుఃఖించుచు, తిరుగుచు నీ పదపద్మముల జేరితిని. ఇక నీవైనా రక్షించు దేవా!

మ. అభిమన్యుండట యుద్ధరంగమున దా నవ్యక్తుడై చొచ్చి వే
నభిభూతుంగురీతి, లోకమను వ్యూహంబందు నే జొచ్చి దే
వ! భయోపేతమనంబుతో నలిగి త్రోవన్ గానకే జిక్కితిన్
అభయంబియ్యవె! నన్ను బ్రోవవె! యనంతా! ..  66

శ్రీరామకృష్ణప్రభూ! అనంతా! అభిమన్యుడు తెలియక యుద్ధరంగమున చొరబడినవిధమున నేనును యీ లోకమను వ్యూహమున ప్రవేశించి, భయముతో నలిగి, మార్గమును దెలియక బాధనొందితిని. దేవా! అభయమును ప్రసాదించి, నన్ను రక్షింపుము.

మ. మనుటే దుర్భరమయ్యెలోకము మహామాయామయంబయ్యెపె
క్కనుతాపంబుల ముంచె భక్తి, పరితాపాగ్నుల్ హృదిన్ గాల్చె నా

మనమో చంచలమయ్యె మృత్యువిదె క్రమ్మంజొచ్చె నే దిక్కులే
దనఘా! ప్రోవుము నన్ను శ్రీపరమహంసా! .. 67

శ్రీరామకృష్ణప్రభూ! పరమహంసా! అనఘా! లోకము మహా మాయామయముగా నున్నది. జీవించుట కష్టముగానున్నది. భక్తి అనేక తాపముల కలిగించుచున్నది. పరితాపాగ్ని హృదయము దహింపజేయుచున్నది. మనస్సు చలించుచున్నది. మృత్యువు దరిజేరు చున్నది. నాకు దిక్కులేదుగదా! రక్షింపుము.

శా. నా రూపున్ గని పక్కుపక్కున గటా! నవ్వంగతంబేమి? ఏ
దారిన్ గాంచక దీవ్రదు:ఖమున నేదైన్యంబునన్నేడ్వగా
వైరానన్ నను వెక్కిరించెనె దిశల్! హాస్యాస్పదంబయ్యెగా
నేరీతిన్ గన నాదు జన్మ గుణశాలీ! .. 68

శ్రీరామకృష్ణప్రభూ! గుణశాలీ! నా స్వరూపమును జూచి నవ్వుటకు కారణం ఏమిటి? దీనుడనై, ఏదరి గాంచక నేను తీవ్ర దు:ఖమున నుండగా దిక్కులు వైరముతో నన్ను పరిహాసము చేయుచున్నవిగదా! ఈ విధంగా నా జీవితము హాస్యాస్పదముగా దయ్యారైనది.

మ. దినముల్ దాటెను నిన్ను గాంచగద! నీ దివ్యాంఘ్రిసంసేవ నే
ననయంబున్ గని మోదమందు తలపుల్ స్వప్నంబులైపోయెనిం
క నిరాసల్ బహుళంబులయ్యె బలుశంకల్ గష్టముల్ మించె నన్
గనులన్ జూడకనుంట భావ్యమె! శుభాంగా! .. 69

శ్రీరామకృష్ణప్రభూ! శుభాంగా! దినములు దొర్లిపోవుచున్నవి గాని నిన్ను దర్శించలేదు. సదా నీ పాదసేవ చేయుచు ఆనందించవలయునను భావనలు స్వప్నములైనవి. నిరాశ అధికం అయినది సంశయములు, కష్టములు ఎక్కువ అయినవి. నీవు నన్ను చూడక యుండుట భావ్యమా!

శా. ఎంతోవేడితి నేడ్చితిన్ విసివితిన్ హేయంపు సౌఖ్యంబులన్

సాంతంబున్ త్యజియించినన్ పరమమౌ సంతోషమున్ గాంచి లో
శాంతిన్‌బొందమికెంతొ దు:ఖిలి నిరాసన్ జెంది 'ఛీ' యంచు నీ
చెంతన్ జేరకపోదునేమొ! యకటా! శ్రీ . . 70

శ్రీరామకృష్ణప్రభూ! అకటా! ఎంతో ప్రార్థించాను నిన్ను. ఎంతో విలపించాను, హేయసుఖముల సాంతముగ త్యజించి యుంటిని. పరమసంతోషమును పొందలేక, శాంతిని అందుకొనలేక, ఎంతో దు:ఖించాను. విసిగిపోయాను. నిరాస చెందాను. నీ దరికి చేరలేనేమోగదా!

శా. ఎన్నాళ్ళిట్టుల యోచనాజగతిలో తృప్తుండనై యుంట! నే
నేన్నాళ్ళింకను మిమ్ము గాంచక గటా యిట్లుంట వ్యర్థుండనై!
ఎన్నాళ్ళుండుట వ్యర్థలోకమున! సర్వేశా! పరంధామ! ఇ
ట్లెన్నాళ్ళింక బరీక్ష నాకు అకటా! శ్రీ . . 71

శ్రీరామకృష్ణప్రభూ! అయ్యో! నాకు ఎన్ని దినములు యీ పరీక్ష? ఆలోచనాలోకమున ఎన్నిరోజులు తృప్తిపడి ఉండుట? పరంధామా! నిన్నుగాంచక ఎన్నిదినములు వ్యర్థమగుచున్నవి! సర్వేశా! ఈ అనవసర ప్రపంచమున ఎన్నిదినములు ఉండటమోగదా!

శా. నిన్నే గోరితి, నిన్నె నమితిని, నిన్నే గొల్చి ప్రార్థించి, నీ
సాన్నిధ్యంబును గోరితిన్, జపతపస్స్వాధ్యాయరూపంబులన్
నిన్నున్ సాధ్యముజేయ నెంచితి, నికన్ నీ ప్రేమరాకున్నచో
భిన్నంబై చెడు నాదు సాధన తపస్వీ! . . 72

శ్రీరామకృష్ణప్రభూ! తపస్వీ! నిన్నే కోరి, నిన్నే విశ్వసించి, నిన్నే ఆరాధించి, నిన్నే ప్రార్థించి, నీ సన్నిధానం కోరుకున్నాను. జపతపస్స్వాధ్యాయములతో నిన్ను సాధ్యం చేసుకోవాలని ప్రయత్నించుచున్నాను. నేటికైన నీ ప్రేమ నాపై ప్రసరింపనిచో నా సాధన చెడిపోవు అవకాశమున్నదిసుమా!

మ· అసహాయుండను, శక్తిశూన్యుడను, సత్యాన్వేషణోద్రిక్తమా
నసుడన్, భక్తజనైకభృత్యుడను, సన్మార్గంబులన్ జూపి సం
తసమునీ గూర్పగలట్టి సద్గురుల సందర్శింపగా లేక నే
విసుగుం జెందితి, నిన్ను గొల్చితిని, రావే ·· 73

శ్రీరామకృష్ణప్రభూ! నేను నిస్సహాయుడను· బలహీనుడను, సత్యాన్వేషణముచేయు మనస్సు గలవాడను· భక్తజనావళికి దాసుడను· సన్మార్గముల దెలియపరచి, సంతోషమును చేకూర్చుసద్గురువుల గాంచలేక విసుగుచెందిన నేను నిన్ను ఆరాధించుచున్నాను· ఇక రా·

శా· నాకీ కష్టపరంపరల్ ధనములై నన్ భోగిగా జేయుతన్
నాకానందము నిచ్చు భాగ్యమువలెన్ నా యీ యసంతృప్తి నే
నీకై నిత్యము వేడుచున్ వెతకుటల్ నిక్కంబు నా వృత్తి ఆ
హా! కైవల్యమనంగ నీ సుఖముగాదా! ·· 74

శ్రీరామకృష్ణప్రభూ! ఈ కష్టపరంపరలన్నియు నాకు ధనములై భోగిని జేయుగాక! నా యీ అసంతృప్తి సంతోషమును కలిగించు సంపదవంటిది యగుచున్నది· నిత్యము నిన్ను ప్రార్థించుచు, అన్వేషించుటయే నా వృత్తి! ఆహా! కైవల్యమన నీ సుఖమేగదా!

శా· నీ పాదంబుల బూజలన్, జపతపోనేకంబులన్ జేసి, నీ
ప్రాపున్ జెందు యఖండమోదమును నాపై నుంపవే, గాక సం
తాపంబుల్ నను ముంప నల్పసుఖసంధానంబునన్ బూర్తిగా
బాపిన్ జేయుము నన్ను, కాదనను దేవా! ·· 75

శ్రీరామకృష్ణప్రభూ! నీ పాదపూజయు, జపతపాదులను గావించిన నన్ను, నీ దరికి జేర్చి అఖండానందమునుప్రసాదింపుము· లేనిచో, అల్ప సుఖసముదాయమున, తాపత్రయాదికమున, నన్ను పూర్తిగా ముంచి పాపిగా చేయుము దేవా! కాదనను·

మ· వలదయ్యా యిక భోగముల్, సుఖములున్, ప్రఖ్యాతులున్, వ్రాతలున్,
పలుకుల్, గ్రంథములున్, బ్రసంగములు, నాపై ప్రేమచే జిత్త చం
చలతన్ నాకిక బాపి, శాంతిసుధకున్ స్థానంబునౌ సత్ సమా
ధుల నాకిమ్ము నమస్కరింతు గుణసింధూ! ·· 76

శ్రీరామకృష్ణప్రభూ! గుణసింధూ! ఇక నాకు భోగములు, సుఖములు, కీర్తిప్రతిష్ఠలు, వ్రాతలు, మాటలు, గ్రంథములు, ప్రసంగములు, యివేమియు వలదు నా చిత్తచంచలత్వమును పోగొట్టి, శాంతిసుధానిలయమగు సత్సమాధులను ప్రేమతో నాకు ప్రసాదించుము· నమస్కారము·

మ· అనయుంబున్ గురుపాదపద్మమకరందాస్వాదనల్ సేయు కో
ర్కి నిరాసల్ బ్రభవించి వ్యాధివలెశక్తిన్ జంపెడిన్, తన్నివా
రణకై నీవు భిషగ్వరేణ్యుడవు! నీ ప్రఖ్యాతదివ్యాంఘ్రి ద
ర్శనభాగ్యంబె మహౌషధమ్ముగద! ఈశా! ·· 77

శ్రీరామకృష్ణప్రభూ! ఈశా! నిత్యము గురుపాదపద్మములందలి మకరందరసాస్వాదన జేయవలెనని కోరిక కలిగి, నా నిరాశ వ్యాధివలె ఆశక్తిని నశింపజేయుచున్నది· ఆ వ్యాధి నివారణకు ఉత్తమ వైద్యుడువు నీవే· ప్రశస్తమైన నీ దివ్యపాదసందర్శనభాగ్యమే గొప్ప ఔషధముసుమా!

మ· నిరతంబున్ నిను జేరి యాటల సదా నీ తోడనే యాడి, భ
క్తిరసాస్వాదనసంపదల్ గనుచు, నీకే సర్వమర్పించి, సు
స్థిరమోదంబున నృత్యగీతములతోజెల్వొందు భాగ్యమ్ము నా
కిడలేవైతివదేమి పాపమగు స్వామీ! ·· 78

శ్రీరామకృష్ణప్రభూ! ప్రతిదినము నిన్ను చేరి, నీతో ఎల్లప్పుడు ఆడుతూ, భక్తిరసాస్వాదన జేయుచు, సర్వమును నీకర్పించి, నృత్య

గీతములతో మెలగుచు, సుస్థిరమైన ఆనందమున నుండు భాగ్యమును నాకు ప్రసాదించవైతివిగదా స్వామీ! ఏమి పాపమోగదా!

శా. శ్రీదేవున్ నిను వేడనంచలిగితో! చిత్తంబునన్ గర్వి వీ
డా దాసుండని కోపమా! నియమనిష్ఠల్ లేమికిన్ గిన్కయో!
ఏదో కారణమెద్దియో తలపు, నన్నేరీతి బాధింప నీ
పాదాక్రాంతుడనైతి నిక్కముగ దేవా! .. 79

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! దేవుడవైన నిన్ను ప్రార్థించలేదని అలిగితివా? లేక 'వీడు గర్వి, దాసుడు కాడు' అని నాపై కోపించితివా? నియమనిష్ఠలులేవని అలుకా? కారణమేమియో అను భావనలు నన్ను బాధించుచుండగా నీ పాదక్రాంతుడనై యున్నానుసుమా! సత్యము.

మ. నిను దర్శించెడు భాగ్యమబ్బునని నే నిర్భీతి బంధంబులన్,
దునియల్ జేయుచు బర్వులెత్తితి సముద్ధోత్సాహినై కాని నిన్
గనలేకుంట, నిదర్శనంబులసలే కన్పింపవౌటన్ నినున్
గనుటే దుర్లభమంచు దోచుగద! రంగా! .. 80

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! నిన్ను దర్శించేభాగ్యం కలుగుతుందని, బంధముల ఛేదించి, ఉత్సాహముతో బరుగులు వేశాను. కాని నిన్ను చూడలేక, కనీసము ఆ నిదర్శనములైనను గోచరింపకుండుటచే, నీ దర్శనం అసాధ్యమని భావిస్తున్నాను.

మ. పిలువన్ బల్కుదువేడ్చినన్ గరుణతో బ్రేమించి రక్షింతువన్
బలుకుల్ గల్లలు, హాసలీలతో గోపశ్రేణితో నాడుటల్
గలలౌ, నిక్కము, నన్ను బ్రోచునెడ నీ కార్యంబులెల్లన్ నిజం
బులు ముమ్మాటికి నమ్ముమింక నను శంభూ! .. 81

శ్రీరామకృష్ణప్రభూ! పిలిచితే పలుకుతావని, ఏడిచిన కరుణతో ప్రేమించి రక్షిస్తావను మాటలు అబద్ధమే. శంభూ! నీవు గోపబాలురతో

నానందముగ నాటల నాడుటయు అసత్యమే. నన్ను నేవు రక్షించిన చో నీ కార్యములన్నియు నిజము. ముమ్మాటికి నన్ను నమ్ము.

శా. దాగన్ జూచెదవేల? నీకు భయమా, ధైర్యంబు నిన్వీడెనా?
త్యాగాలన్ భవదీయ భక్తతతికై తథ్యమ్ముగా సేయుటల్
వాగాడంబరమయ్యెనా? ప్రతినల్ బాటిమ్పగా లేవా! ఆ
ప్రాగల్భ్యమ్ముల నేల కొట్టితివి దేవా! . 82

శ్రీరామకృష్ణప్రభూ! దాగటం ఎందుకు? భయమా? లేక నీకు ధైర్యములేదా? నీ భక్తులకై త్యాగముచేయుట వాగ్దానము లేనా? ప్రతిజ్ఞలను పాటింపలేవా? దేవా! నీ మాటలన్నియు ప్రగల్భములేనా?

మ. నిను జిత్తంబున దాచెనో ధృవుడు! సంస్తంభిన్ గజంబడ్డెనో!
నిను బ్రహ్లాదుడు నిల్పెనో! శబరి బందిన్ జేసెనో! ఆంజనే
యుని గౌగింటను జిక్కితో! పరమభక్త్యున్మత్తతన్ గట్టెనో!
మునివర్యుండు వివేకసంయమి! స్వయంభూ! .. 83

శ్రీరామకృష్ణప్రభూ! స్వయంభూ! నిన్ను ధృవుడు తన చిత్తమున దాచెనా? లేక గజరాజు అడ్డగించెనా? లేక శబరి బంధించెనా? లేక ఆంజనేయుని కౌగిలిలో చిక్కియుంటివా? లేక మునివర్యుడైన వివేకానందుడు భక్తితత్పరతతో కట్టివేసెనా?

మ. తలతున్ వింతగభక్తి రిక్త యని, వ్యర్థంబౌను జ్ఞానంబు నా
గలతన్ జెందెద, ధ్యాన యోగములు సత్కర్మంబులున్ మిథ్యలౌ
పలుకష్టంబుల మోక్షకాంక్ష యిడు నా భావంబులే ముంపగా
జలితాత్ముండను రక్షసేయవె! మహేశా! .. 84

శ్రీరామకృష్ణప్రభూ! మహేశా! భక్తిలేదనియు, జ్ఞానము వ్యర్థమనియు కలత చెందుతాను. ధ్యాన, యోగ, సత్కర్మలు మిథ్య

యని భావించుతాను. మోక్షకాంక్ష అనేక కష్టములను కలిగిస్తుందను భావన కలిగి, మనస్సులో చంచలత్వం కలుగుతున్నది. నన్ను రక్షించు

మ. పరితాపాగ్నినడంప సాగరము నాపై దొర్లిరాదే! మనో
భరమున్ గాల్చ దవాగ్ని పైబడదె! నా పాపంబులన్ ద్రోల భీ
కరమౌ ఝంఝ సుడిగాలి రాదుగద! నా కర్మంబులన్ ద్రెంప న
న్నెరగా గాంచదె మృత్యుదేవతయు స్వామీ! .. 85

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! నా పరితాపనివారణకు నాపై సాగరమైనను దొర్లిరాదుగదా! నా మానసికభారమును కాల్చుటకు దావాగ్నియైనను రాకున్నది కదా! నా పాపముల దొలగద్రోయుటకు భయంకరమైన సుడిగాలియైనను రాకున్నదిగదా! నా కర్మపాశముల త్రెంచుటకు మృత్యువైనను సమీపించదుగదా!

మ. గగనంబే పడుగాక నన్ దునుమగా! ఖండంబులై వేగ నన్
వెగటార్పన్ బడుగాక మేఘములు! నన్ దీనున్ దినేశుండు పూ
ర్తిగ భస్మాకృతి సేయుగాక! మనుటల్ రిత్తయ్యె! వ్యర్థంబుగా
బగులున్ జన్మము గాజుముక్కవలె దేవా! .. 86

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! నన్ను చంపుటకు ఆకాశము నాపై పడుగాక! నన్ను ముక్కలు జేయుటకు మేఘములు పడును గాక! దీనుడనైన నన్ను సూర్యుడు పూర్తిగా భస్మము చేయుగాక! జీవించుట వ్యర్థము. ఇక గాజుముక్కవలె జన్మము వ్యర్థముగా పగులుచున్నదిగదా!

శా. ఏ నీ నామవిలోలతోన్నతి బ్రపంచేచ్ఛల్ దరిన్ జేరవో!
ఏ నీ వాక్యసుబోధ యింద్రియజయంబేర్పాటు గావించునో!
ఆ నిర్వాణప్రదమైనసిద్ధి నిడి బ్రహ్మాత్మక్యానుసంధానమం
దే నుండన్ గల సూత్రమున్ దెలుపరావే! .. 87

శ్రీరామకృష్ణప్రభూ! ఏ నీ నామోచ్చారణముచే బ్రపంచక రికలు చెంతకు చేరవో, ఏ నీ ప్రబోధములు ఇంద్రియనిగ్రహం ప్రసాదించునో, జ్ఞేష్ఠ నిర్వాణప్రదమైన సిద్ధిని అనుగ్రహించి, నిత్యము బ్రహ్మైకానుసంధానము చేయగలుగు సూత్రమును నాకు దెలియజేయుటకు రమ్మ.

శా. నీకై కానల గొండలన్ దిరిగితిన్, నిన్ బొందు చిత్తంబుతో
లోకవ్రాతములెల్ల గ్రుమ్మరితినో లోకేశ్వరా! నా మనో
వైకల్యంబును బాపి, శాంతి నొడగూర్పన్ నిన్ను ప్రార్థింతునే!
నా కష్టంబుల వీడజేయుమెటులైనన్ .. 88

శ్రీరామకృష్ణప్రభూ! లోకేశ్వరా! నీకొరకు అరణ్యాలలో, కొండలలో తిరిగియుంటిని. నిన్ను పొందు మనస్సుతో లోకమంతయు తిరిగితిని. నా మనోవికలత్వాన్ని తొలగద్రోసి, నా కష్టముల పారద్రోలుము.

మ. చీకట్లం గని వెల్గు పర్వుకరణిన్, సింహంబు భీతిల్లుచున్
మేకన్ గాంచిన బారురీతి, గన స్వామీ! భీతచేతస్కయై
ఆకంపించుచు బర్వులెత్తుగద బ్రహ్మజ్ఞానమజ్ఞానదు
ష్టాకారంబును గాంచి చోద్యముగ నీశా! .. 89

శ్రీరామకృష్ణప్రభూ! స్వామీ! అంధకారమును గాంచి ప్రకాశము పరుగువేయునట్లు, మేకనుజూచి మృగరాజు భీతిల్లుచు పరుగెత్తినచందము, అజ్ఞానమను దుష్టస్వరూపమును తిలకించిన బ్రహ్మజ్ఞానము భయముతో పర్వులెత్తుచున్నదిగదా! ఈశా! ఎంత చోద్యము!

మ. ధనధాన్యంబులు, తల్లిదండ్రులు, గురుల్, దారల్, సఖుల్, సోదరుల్
దన యుల్ మృత్యుముఖంబునంబడుట సంతాపింతురేగాని, 'దే

వుని నిన్నున్ గనమైతిమే, ప్రభుని ప్రాపున్ బొందగానైతిమే'
యని దుఃఖింపరుగాదె లోకమున దేవా! .. 90

శ్రీరామకృష్ణప్రభూ! ఈ లోకమున మృత్యుముఖమున నుండు సమయమునగూడ ధనధాన్యములు, తల్లిదండ్రులు, స్నేహితులు, సోదరులు, భార్యాబిడ్డలు అని సంతాపము చెందుదురు గాని, 'దేవా! దేవుని నిన్ను జూడకపోతిమిగదా! నీ సన్నిధిని పొంద లేకుంటిమిగదా' అని దుఃఖింపరుగదా!

శా. నా మిత్రుండును, నాతనూజుడితడున్, నాతల్లి నాతండ్రి యం
చేమేమో మమకారబంధములచే స్వేచ్ఛాకృతిన్ బాసి,ఆ
వ్యామోహంబున మ్రగ్గుచుందురిగద! నిత్యానందు నిన్
బొంద నే
నామంబైనను పల్కరారుగద యన్నా! .. 91

శ్రీరామకృష్ణప్రభూ! నా మిత్రుడు, నా కుమారుడు, నా తల్లి, నాతండ్రి యనుచు అనేక మమకారబంధములచే నస్వతంత్రులై, ఆ వ్యామోహమునబడి తపింతురుగదా! కాని అన్నా! నిత్యానందుడవైన నిన్ను జేరుటకు నీనామమైనను పలుకరుగదా!

మ. భ్రమచే నీరని యెండమావులను సంభావించు నజ్ఞాని, స
ర్పముగా ద్రాటినిగాంచు భ్రాంతుడును, అవ్యక్తుండుగా వెండి శు
క్తమునన్ గాంచెడువాడు, చూడగలడే జ్ఞానస్వరూపున్, ఘనున్
అమితానందు మహాత్మ నిన్ను గురుదేవా! .. 92

శ్రీరామకృష్ణప్రభూ! గురుదేవా! అజ్ఞానముచే ఎండమావుల జూచి జలముగ భావించువాడును, త్రాటిని సర్పముగ గాంచువాడును, ముత్యపుచిప్పయందు వెండిని తిలకించువాడును, ఆనందస్వరూపుడవును, జ్ఞానఘనమూర్తివి, మహాత్ముడవైన నిన్ను తెలియలేరుగదా!

మ. పెదశాస్త్రంబుల బిప్పిసేయు చదువుల్ వేదాంతవాదంబులున్

బదభేదంబులు తర్కవాదములు తత్వార్థప్రకర్షంబులన్
చదువన్ గార్యమొకింతయుండునె। సదా సద్భక్తియుక్తంబుగా
మదిలో నిన్ను భజింపకుండిన మహాత్మా। .. 9

శ్రీరామకృష్ణప్రభూ। మహాత్మా! సద్భక్తితో నెల్లప్పుడు నిను చిత్తమున భజింపకున్నచో నీ శాస్త్రపఠనములు, వేదాంతవాదములు పదభేదములు, తర్కవాదములు మొదలైనవానివలన నేమి ప్రయోజనము?

శా· ఎన్నెన్నో యధికారముల్ గలుగ, నెన్నో గ్రంథముల్ గ్రోల, నె
న్నెన్నో మాటలనాడ, వేదముల నెన్నోమార్లు వర్ణింప, నో
యన్నా। సున్న, జితేంద్రియుంబుగని, యభ్యాసంబు గావించి భా
వౌన్నత్యంబు గడింపకుండిన మహేశా। ... 9

శ్రీరామకృష్ణప్రభూ। మహేశా! ఎన్ని అధికారములున్నను, ఎన్ని గ్రంథముల జదివినను, ఎన్ని ప్రసంగముల చేసినను, వేదముల నెన్ని పర్యాయములు వర్ణించినను, ఇంద్రియనిగ్రహము, ఉన్నత భావసంపదలేనిచో నివియన్నియు వ్యర్థమేగదా!

మ· తమ చారిత్రసుధాతరంగముల నీదన్, నీ మహావాక్య సా
రమశేషంబుగ గ్రోల, నీదు సుగుణప్రజ్ఞాప్రసారంబులన్
శ్రమదీరంగ మునుంగ, నీ పసిడితేజంబందునం దేల, వే
రె మనోజ్ఞంబగు మోక్షమెందుగలదో। శ్రీ .. 9

శ్రీరామకృష్ణప్రభూ! నీ జీవితసుధాతరంగముల నీదులాడుచు, నీ మహావాక్యప్రబోధసారమును పరిపూర్ణముగ గ్రోలుచు, నీ సుగుణప్రజ్ఞానప్రవాహమున శ్రమదీరునట్లు మునుగుచు, స్వర్ణకాంతియందు దేలుచునుండినచో నిక ఆనందమయ మోక్షము వేరుగా ఎచ్చట నున్నది?

మ· నిను బ్రార్థించుచు నామమున్ బలుకుచున్ నీ పాదపంకేరుహం
బును బూజించి నమస్కరించి గురుతత్త్వోద్భూతబోధామృతం

బును సేవించుచు, సాశ్రునేత్రుడయి ప్రేమోన్మత్తుడై యాడినన్
గనడే మోక్షము భూతలంబుననె రంగా! .. 96

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! నిన్ను ప్రార్థించుచు, నీ నామమును పలుకుచు, నీ చరణములను పూజించి, నమస్కరించి, నీ నోధామృతమును సేవించి, ఆనందబాష్పములతో ప్రేమోన్మత్తతచే నృత్యము సలిపినచో యిచ్చటనే మోక్షమును పొందునుగదా!

మ. పసిడిన్ మట్టిని నేకదృష్టి గనినన్ వ్యామోహమేలేని బా
లు సమానంబుగ స్త్రీనిదల్లివలె నాలోకించినన్ సర్వ జీ
వసమూహంబును బ్రేమతో గనిన, నిర్వ్యాజంబుగా గర్మ జే
య, సమాయత్తముగాదె మోక్షమిట దేవా! .. 97

శ్రీరామకృష్ణప్రభూ! దేవా! బంగారమును, మట్టిని ఏకదృష్టి తిలకించి, వ్యామోహరహితుడైన బాలునివలె స్త్రీలను మాతృమూర్తివలెజూచి, సర్వజీవుల బ్రేమతో గాంచి, నిష్కామముతో గర్మలనాచరించిన మోక్షమిచ్చటనే లభించును.

మ. జలమేరీతిగ దేశదేశముల భాషాభేదమున్బట్టియే
జలమంచున్, మరి నీరు, వాటరని, దేశాలన్ ప్రవర్తిల్లునో
అల దేవుండు శివుండు విష్ణు యహోవా యల్లా యుమా నామముల్
గలవాడయ్యు నభిన్నుడౌనుగద! రంగా! .. 98

శ్రీరామకృష్ణప్రభూ! రంగా! జలము ఏ విధముగా దేశదేశముల బ్రవహించుచు, భాషాభేదములచే నీరు, జలము, వాటర్, అని పిలువబడునో అదేవిధముగ ఆదేవుడును దేశదేశముల భాషాభేదముచే శివ, విష్ణు, ఉమ, అల్లా, యహోవా నామముల వ్యవహరింపబడెనని, అందు భిన్నత్వము లేదనియు ఆచరణపూర్వకముగ నమైక్యతను బోధించితివిగదా!

మ. స్తవనీయంబగు కామరాజుకులసంజాతుండ, శ్రీచెన్నకే
శవులున్ లక్ష్మిసరస్వతీ హృదయ సత్‌జన్ముండ, సద్భక్త బాం
ధవుడన్, సింగరిదాస పౌత్రుడను, ముకుందాఖ్యుండ, నిన్ గూర్చి నే
స్తవమున్ జేయదలంచి వ్రాసితిని యీ 'శ్రీరామకృష్ణాంజలిన్,

శ్రీరామకృష్ణప్రభూ! శ్రీ భక్తసింగరిదాస పౌత్రుడనై, ప్రసిద్ధమైన కామరాజువంశోద్భవుడనై, శ్రీ లక్ష్మీసరస్వతీ, చెన్నకేశవుల పుత్రుడనై, సద్భక్తులకు బంధువును, ముకుందనామధేయుడనైన నేను నిన్ను స్తుతించు సంకల్పముతో యీ '**శ్రీరామకృష్ణాంజలి**' ని వ్రాసితిని.

మ. జయ చంద్రామణిపుత్ర! కాళీసుత! శాస్త్రార్థస్వరూపా! హరీ!
జయ సర్వోత్తమతత్త్వలోకగురు! సాక్షాత్ సచ్చిదానందమా!
జయ మౌనేంద్ర! నరేంద్రపూజిత! సురేశా! శ్రీముకుందప్రియా
జయముప్పొంగునుగాక భక్తులకు నీశా! 100

శ్రీరామకృష్ణప్రభూ! చంద్రామణిపుత్రా! కాళీసుతా! శాస్త్రార్థస్వరూపా! హరీ! సర్వోత్తమతత్త్వలోకగురూ! మౌనేంద్రా! నరేంద్రపూజితా! సురేశా! సాక్షాత్ సచ్చిదానందమా! శ్రీముకుందప్రియా! నీకు జయమగుగాక! ఈశా! నీ భక్తులకు జయముప్పొంగునుగాక!

మంగళం మహత్

# సాధకలోకానికి అపూర్వకానుక!

## A RARE GIFT ON THE PATH OF SPIRITUAL WORLD

### సాధకులందరూ తప్పక చదువదగిన ఉత్తమ గ్రంథము

11 ముద్రణముల పొంది, వేలాది ప్రతులు అమ్మబడె, ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణములలో అపూర్వ సంచలనము కల్గించి, ముముక్షువులకు సాధనామార్గములో మార్గదర్శియై, పత్రికల, పండితుల, పాఠకుల, ప్రముఖుల — ప్రశంసలు పొంది, సాధకుడు చేయవలసిన ఆధ్యాత్మిక సాధనావిధానము లను చక్కని వ్యావహారిక భాషలోదెలిపి, అశేష ప్రజాదరణ పొందిన అనుష్ఠానప్రబోధాత్మక మహోత్కృష్ట గ్రంధరాజము.

అనుభవస్వరూపు 'లు

'శ్రీ అనుభవానందస్వామి' విరచిత ...

## సాధనరహస్యము

## The Secret Of Yoga Sadhana

భగవత్ సాక్షాత్కార మార్గమును తెలియజేసిన యీ అనుభవైకవేద్యగ్రంథము, 20 భాషలలో ప్రకటింపబడనున్నది. కొన్ని భారతీయ భాషలలో ప్రకటింపబడినది.

1/8 డెమ్మీ — వెల : 35-00

'సాధనరహస్యము' కంటె ఆత్మసాక్షాత్కారమార్గమును తెలుపు అనుభవపూరిత గ్రంథము దుర్లభము.



